# పతివ్రతలు

(మొదటి భాగ[redacted]

వి. శేషగిరిరావు బి. ఏ.



ప్రకాశకులు

సింహా అండ్ కో

రాజమండ్రి

[రు 0-6-0.

త్వరలో వెలువడనున్నవి!

# ప్రభాసీ వాచకములు

1 మొదలు 5 వ తరగతివరకు

దొరతనమువారి నూతన సిలబసు ననుసరించి, అనుభవశాలు రగు నిరువురు పండితోపాధ్యాయులచే బాలబాలికలకు సుబోధక మగు శైలిలో వ్రాయఁబడినవి. నీత్యుద్బోధకము లగు కథలు, పద్యములు, చక్కని చిత్రములు గలవు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రభాసీ వాచకము | మొదటి తరగతి | 0 | 2 | 0 |
| ... | రెండవ తరగతి | 0 | 3 | 0 |
| ... | మూడవ తరగతి | 0 | 4 | 0 |
| ... | నాల్గవ తరగతి | 0 | 5 | 0 |
| ... | అయిదవ తరగతి | 0 | 6 | 0 |

వలయువారు:- సింహా అండ్ కో
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, రాజమండ్రి.

# సావిత్రి



అశ్వపతి మద్రదేశమునకు రాజు. ఆతనిభార్య మాళవి. అశ్వపతి చిరకాలము సంతానహీనుఁడై యుండెను. ఆతఁడు సంతానలాభముకొఱకు కెన్నో వ్రతములు చేసెను. దానములిచ్చెను. ధర్మములు చేసెను. కులదేవతయగు సావిత్రినిఁ గొల్చెను. సావిత్రీదేవి అశ్వపతి తపమునకుమెచ్చి, ప్రత్యక్షమై "రాజా! నీతపస్సును మెచ్చితిని. అచిరకాలములో నీ కొకకుమార్తె కలుగఁగల" దనెను.

ఇట్లని యామె యదృశ్యయయ్యెను. కొంతకాలమునకు మాళవి గర్భముఁదాల్చెను. నవమాసములు గడచినపిమ్మట శుభదినమున మాళవికి యాఁడుశిశువు పుట్టెను. అశ్వపతి తనకు అసాధారణ సౌందర్యవతియగు కుమార్తె జన్మించినదని విని, మేరమీరిన యానందము నొందెను. సావిత్రీదేవి యనుగ్రహమున జన్మించిన దగుటచే రాజామెకు సావిత్రి యని నామకరణము చేసెను.

శుక్లపక్షములోని చంద్రునివలె సావిత్రి దినదినప్రవర్ధమానయయ్యెను. సుగుణములదొంతియైనయామె పంద్రెండు సంవత్సరముల వయస్సుకలదై, వివాహయోగ్య యయ్యెను.

ఒకనాఁడామె పూజార్హములైన పూవులను గోసికొని వచ్చుటకై, చెలులతో పురము వెలుపలఁగల వనమునకు వెళ్లెను. ఆయడవిలో నొక ఋష్యాశ్రమమున ద్యుమత్సేనుఁడను రాజర్షి నివసించుచుండెను. ఆతనికి సత్యవంతుఁడను పుత్రుఁడు కలఁడు. సత్యవంతుఁడు సుందరుఁడు, సద్గుణ సంశోభితుఁడు, ధైర్యసాహస పరాక్రమములుకల బాల వీరుఁడు నని చెప్పఁదగినవాఁడు. ఆతఁడు తాపసబాలునివలె కాషాయాంబరములు ధరించెడివాఁడు. ఆతనింజూచి సావిత్రి పరమ సంతోషము నొందెను. ఆతఁడును తననుచూచి సంతోషించియే యుండునని తలఁచెను. పూలు కోసికొనిన పిదప నామె చెలికత్తెలతో నింటికి వెడలిపోయెను.

౨

అశ్వపతి సావిత్రి వివాహమునుగూర్చి, దేశమంతటను జాటింపించెను. వివిధదేశముల పరిపాలించు రాజకుమారుల చిత్తరువులఁ దెప్పించెను. సావిత్రి యాపటములన్నియుఁ జూచి, యందొకదానిని తీసి, తండ్రికి చూపెను.

మునికుమారునివలెనున్న యీబాలుం డెవరో తెలిసికొనవలెనని అశ్వపతి కుతూహలము చెందెను. ఇంతలో నొకనాఁడు నారదమహర్షి అశ్వపతినిఁ జూచుటకు వచ్చెను. అశ్వపతి నారదమునీంద్రుని కర్ఘ్యపాద్యములిచ్చి, గౌరవించి యిట్లు పలికెను.

"నారదమునీంద్రా! నాపుత్రికయైన సావిత్రికి పెండ్లిచేయ తలంచినాను. ఆమె కెటువంటి సుందరులైన రాజపుత్రులపటములు చూపించినను, వారల నొల్లక, నొక ఋషికుమారుని వరించినది. ఆతఁడు రూపమున మునికుమారునిఁ బోలియున్నను, ముఖమునందు రాజపుత్రుని లక్షణములు పొడకట్టుచున్నవి. ఇదిగో, యీచిత్రమును జూడుఁడు. త్రిలోకసంచారులగు తమకు తెలియని విషయములు లేవు. ఈబాలుని తలిదండ్రులెవరో తెలిసికొన గోరుచున్నాను."

ఇట్లని యతఁ డాచిత్తరువును నారదుని చేతికిచ్చెను. నారదుఁ డాపటమును జూచి "రాజా! ఈతఁడు సాళ్వదేశాధిపతియగు ద్యుమత్సేనుని సుతుఁడు. చిత్రాశ్వుఁడను పేరు కలవాఁడు. సత్యసంధుఁడగుటచే సత్యవంతుఁడను పేరుకూడ కలిగినది. ద్యుమత్సేనుఁడు శత్రువులచే యుద్ధములో నోడింపఁబడి, రాజ్యమును గోల్పోయి, సతీసుతులతో నరణ్యమందు వసించుచున్నాఁడు. సత్యవంతుఁడు రూపవంతుఁడు,

ధైర్యసాహసములు కలయువకుఁడు, సుగుణశాలియనుమాట నిజమేకాని అల్పాయుర్దాయముకలవాఁడు. అతఁడు వివాహ మైన పిదప నొక సంవత్సరము మాత్రమే జీవించును" అని చెప్పెను.

ఈమాటలువిని అశ్వపతి మిక్కిలి చింతించి, సావిత్రిని బిలిచి యిట్లనెను.

"అమ్మాయీ! ఆయుర్దాయము లేని సత్యవంతునివివాహ మాడి, మాకువిచారము నేలకలిగించెదవు? మఱియు సత్యవం తుఁడు నిర్ధనుఁడైన రాజుకొడుకు. నీవిన్నాళ్లు నతిగారాబ మున పెరిగినదానవు. అడవులలో ననేకములగు యిడుమల పాలగుదువు. కొంచమైన సుఖముండదు. కష్టములతోఁ గూడిన జీవితము నేల కోరుకొందువు? నామాటవిని, మఱి యేరాకొమరునైన పెండ్లియాడి సుఖించుము."

సావిత్రి సత్యవంతునే పెండ్లిచేసికొనవలెనని దృఢముగ సంకల్పించి యుండుటచే తానుపట్టినపట్టు విడువదయ్యెను. ఆమె తండ్రినుద్దేశించి యిట్లనెను. 'తండ్రీ! ఒకనిని మన సార ప్రేమించిన తరువాత మఱియొకనిఁ బ్రేమించుట యుత్తమ రాజపుత్రి లక్షణ మగునా? కాత్యాయనీదేవి దయయు న్నచో నతఁడు దీర్ఘాయువుచెంది మఱల రాజ్యమును బొంద రాదా?"

అశ్వపతి సావిత్రి తనబుద్ధి మరలించుకొనునేమో యని చాలసేపు ప్రతిమాలెను. ఎంతబోధించినను ఆమె విన లేదు. నారదుడంత నశ్వపతి నుద్దేశించి "రాజా! నీవణు మాత్రమైన సంశయింపక, సావిత్రిని సత్యవంతుని కిచ్చి, వివాహము చేయుము. ఈమె పతిభక్తియే సత్యవంతుని మృత్యుముఖమునుండి కాపాడగల"దని వెడలిపోయెను.

నారదుని పలుకులువిని, అశ్వపతి యట్లే చేయనిశ్చయించెను. శుభదినమున మంత్రి పురోహిత పరివార సమేతుండైయాతడు ద్యుమత్సేనుని యాశ్రమమునకు వెళ్లెను. ద్యుమత్సేనుడశ్వపతిని గౌరవించికుశలప్రశ్న లడిగినపిమ్మట, నతడు వచ్చినకారణము దెలుపఁ గోరెను. అశ్వపతి తనకూతురును సత్యవంతునికిచ్చి పరిణయము కావింపదలంచితినని చెప్పెను. అంధరాజగు ద్యుమత్సేనుడు మొట్టమొదట నతని మాటలను నమ్మలేదు. అశ్వపతితో నరుదెంచిన మంత్రులు తాము సావిత్రివివాహము చూచుటకే రాజు ననుసరించి వచ్చితిమని చెప్పఁగా, ద్యుమత్సేను డిట్లులనియెను.

"రాజేంద్రా! రాజ్యమును గోల్పోయి, సకుటుంబముగ నడవిలో వసించుచున్న నాకు నీపలుకులు మిక్కిలి యాశ్చర్యమును గలిగించినవి. నీ తనయ సుకుమారి. కష్టముల సహింపజాలదని కోమలి. నేను పూర్వస్థితిలో నున్నప్పుడు

నీవడిగినయెడల, వెంటనే అంగీకరించి యుందును. నీకు నే నేమిచెప్పఁగలను. నీకోరిక నిరాకరింతునా? "సిరిరా మోకా లొడ్డువా"రుందురా? కాని వ్యవధిలేక యేరీతిని పెండ్లిచేయుదును?"

పెండ్లికి కావలసిన సంభారములెల్ల తాము తీసికొనివచ్చితిమని చెప్పి, అశ్వపతి మఱుచటిదినము శుభలగ్నమున సావిత్రీ సత్యవంతులకుఁ బెండ్లిచేసెను.

వివాహానంతరము అశ్వపతి కూతుఁరు నత్తవారింటనే యుంచి, అత్తవారింట మెలగవలసిన రీతులఁ జెప్పి, రాజధానికి తిరిగి వెడలిపోయెను. సావిత్రియత్తమామల యిష్టగులకు మడుగులొత్తుచు, చెప్పినపనులెల్ల చేయుచు, పతిభక్తిపరాయణయై మెలఁగుచుండెను.

## 3

సావిత్రి నారదుఁడు చెప్పిన మాటల ననుసరించి రోజులు లెక్కపెట్టుకొనుచుండెను. సంవత్సర మంతమగుటకిఁక నాలుగు దినములుండఁగా నామె త్రిరాత్రోపవాసము చేయఁబూనెను. ఆమె యొకక్షణమైన పతినిఁబాయకుండెను. వ్రతదీక్షను బూనిన నాలుగవనాఁ డామె కాళికాదేవిని భక్తిశ్రద్ధలతోఁ గొల్చుచుండఁగా, సత్యవంతుఁడు సావిత్రినిఁజూచి "నీవేల నీ

వ్రతము చేయుచున్నా"వని యడిగెను. సావిత్రి పతినిఁజూచి చిఱునవ్వునవ్వి "నాథా! కాత్యాయనీవ్రతము నేటితోఁ పూర్తియగును. రేపు మీ కీవ్రతము చేసిన కారణము తెల్పెదనుకాని, మీ రిప్పుడెచ్చటికేగుచున్నా"రని యడిగెను. సత్యవంతుఁడు సమిధలు కుశలు ఫలములు తీసికొని వచ్చుటకడవికి వెళ్లుచున్నానని చెప్పఁగా నామె యతనితోఁగూడ వచ్చెదననెను.

సత్య:—కాంతా! మూఁడుదినములనుండి యాహారము లేకబడలియున్నదానవు. నీవిట్టిస్థితిలో నరణ్యమునకు రాఁదగునా? మఱియొకప్పుడు తీసికొని వెళ్లెదను. ఇప్పుడు నీప్రయత్నమును మానుము. అయినను నీవు సుకుమారివి. అడవు లన్న నేమనుకొంటివి? సింహములు, వ్యాఘ్రములు, భల్లూకములు, మున్నగు క్రూరజంతువులు వనమునందు స్వేచ్ఛగా తిరుగుచు భయంకరముగ గర్జించుచుండును. అడుగడుగునకును ముళ్లు గుచ్చుకొనుచు మిక్కిలి బాధకలిగించుచుండును. నన్ననుసరించి నీవిట్టిబాధ లనుభవింపఁజాలవు. నీయుద్దేశము నీకనైనమానుము."

సావిత్రి:—నాథా! మీరు నాచెంతనుండ నాకేమిభయము? ఉద్యానవనము నెఱుఁగుదునుగాని యడవి నెఱుఁగను.

అందుచేతనే మీతో వచ్చి, విపినమునందలి వృక్ష
ములను, సెలయేళ్లను, జూడగోరుచున్నాను. మీకు
నేనచటమాత్రము సాయము చేయఁగూడదా?
మీరు కట్టెలఁ గొట్టుచుండఁగా నేనవియెత్తి, త్రాడు
పై చక్కఁగా ప్రోగుపెట్టుచును. మీ రింధన
ములఁ దీసికొనివచ్చుచుండ, నేను కుశఫలములఁ
గొనివచ్చెదను. మీ రేతీరున నటమెలఁగుదురో
చూడ వాంఛించుచున్నాను."

సత్యవంతుఁడు సావిత్రికోరిక త్రోసివేయఁజాలకపోయెను. సావిత్రి యత్తమామల యనుజ్ఞబడసి, భర్తతోఁగూడ వనమునకుఁ బయన మయ్యెను.

౪

సావిత్రీ సత్యవంతులు కాంతారమున చాలసేపు విహరించిరి. ఋష్యాశ్రమములఁ దిలకించిరి. కొన్ని చూతఫలములు కోసిరి. దర్భలు సేకరించిరి. తరువాత సత్యవంతుఁడు కట్టెలను కొట్టసాగెను. కట్టెలు కొట్టుచుండఁగా నతనికి శిరోవేదనము కలిగినది. వెంటనే యతఁడు చెట్టునుండి క్రిందికిదిగి, సావిత్రి యంకతలమునఁ దలను బెట్టుకొని, కనులుమూసికొని పరుండెను. అతనికాలుచేతులు చల్లనయ్యెను. సావిత్రి తనపతి మృతిఁజెందెనని విలపింప సాగెను. వెంటనే యమధర్మరాజు

వచ్చి, సత్యవంతుని కంఠమునకుఁ బాశమును దగిలించి, ప్రాణములఁ దీసెను. కాత్యాయనీదేవి మహిమచే సావిత్రికి యమధర్మరాజు గోచరించెను. అగ్నికణములను వెదఁజల్లు విశాలనేత్రములును, వినీలశరీరమును, చేత కాలపాశమును, మహిషవాహనమును గల కాలునిఁ జూచి సావిత్రి భయాశ్చర్యము లొక్కుమ్మడి ముప్పిరిగొన, నోటమాటరాక లేచి నిలువఁబడి, యెట్టకేలకొకింత దిట్టతనమువహించి యిట్లనెను.

"అయ్యా! మీరెవరో దివ్యపురుషునివలెఁ గాన్పించుచున్నారు. మీరెవరో యెఱుంగవచ్చునా?"

**యముఁడు**:—సాధ్వీమణీ! నేను యమధర్మరాజును. పుణ్యవతివగుటచే నీకునాస్వరూపము కనిపించినది. నీభర్తకు బ్రహ్మ లిఖించిన యాయుష్కాలము నేటితోఁ దీరినది. నీనాథుఁడు సత్యశీలుఁ డగుటచేతను, నీవు పతివ్రతాశిరోమణి వగుటచేతను, నాభటులను బంపక నేనేస్వయముగా వచ్చితిని. సత్యవంతుని యసువులఁ గొనిపోవుచున్నాను. నీవిఁక నింటికిఁబోవచ్చును.

ఇట్లని దండధరుఁడు వెడలిపోయెను. లోపలినుండి పొంగి పొరలివచ్చు దుఃఖము నాపుకొని, ధైర్యమువహించి, సావిత్రి యముని వెంటనే బయలుదేఱెను. కృతాంతుఁడు సావిత్రి తన ననుసరించి వచ్చుచుండుటచూచి, ఆమె నుద్దేశించి యిట్లు పలికెను.

"సావిత్రీ! నీవెచ్చటికి వచ్చుచున్నావు?"

సావిత్రి:—నాభర్త యెచ్చటికేగునో యచ్చటికి వచ్చుచున్నాను.

యముడు;—నీనాథుని ఆయుర్దాయము చెల్లిపోయినది. నీవింకను మర్త్యలోకమున జీవింపవలసియున్నది. నీవింక నింటికిఁబోయి, నీపతియాత్యక్రియల నెఱవేర్పుము.

సావిత్రి:—శమనా! సతికి పతియేగతి. పతినివిడిచి సతియెందేగును! నాపతికిఁ బ్రాణములనిమ్ము. వెడలిపోయెదను.

యముడు:—అబలా! మానవులు తమ పూర్వజన్మమునందు చేసిన పాపపుణ్యములఫలము నీజన్మమునం దనుభవించి, తరువాత నరకలోకమునకుఁ బోవలసియున్నది. నన్ననుసరించినంతమాత్రమున నీకేమియు లాభము కలుగఁజాలదు. నేనరుగుమార్గము దుర్గమము. ఇంకనైన నింటికిఁబోయెదవా?

సావిత్రి:—అయ్యా! నాపతియొక్క దేహమునుండి నన్ను వేఱుచేయఁగలరుకాని, యాత్మనుండి విడఁదీయుట యసంభవము. నన్నుకటాక్షించి, నాపతిప్రాణముల నిండు.

యముడు;—బేలా! నీపతిభక్తికి మెచ్చితిని. పతిప్రాణములఁ దక్క వేఱొకవరమేదైన కోరుకొను మిచ్చెదను.

సావిత్రి:—ప్రేతనాయకా! భర్త లేని భార్య బ్రతుకేటికి? అయినను నీవొకవర మనుగ్రహింప నేనేల కాదన వలెను? నాయత్తమామలు అంధులైయున్నారు. వారికి దృష్టిప్రసాదింపుము.

యముఁడు:—అటులే యగుఁగాక. నీవిఁక వెనుకకు మరలుము.

సావిత్రి:—వైవస్వతా! నీవు ధర్మస్వరూపుఁడవగుటచే ధర్మ రాజువనియు, సమస్త ప్రాణికోటులయెడలను సమబుద్ధి కలవాఁడవగుటచే సమవర్తివనియు జనులుపిలుతురు. పతికిసతియర్థాంగి. నేను పుణ్యవతినగుటచేతనే నీదర్శనములభించినది. నాపుణ్యములో సగము నాభర్తకుఁ జెందదా? అట్లైన నతినిఁ బ్రతికించదా? నాబహిఃప్రాణ మగు నాపతిప్రాణములఁ గొంపోవఁదగునా?

యముఁడు:—సాధ్వీ! నీధర్మోపన్యాసము నాకానందము కలి గించినది. పతిజీవములతప్ప మఱొకవరమేదైన కోరు కొను మిచ్చెదను.

సావిత్రి;—మహాత్మా! నామామగారు రాజ్యచ్యుతులై, దారిద్ర్యపీడితులై మిక్కిలి కుందుచున్నారు. వారికి రాజ్యప్రాప్తియగునట్లు చేయుఁడు.

యముఁడు;—అట్లేయగుఁగాక! ఇంకనీవు వెనుకకు మర లుము. ఈపైమార్గము కంటకభూయిష్టమైనదగుటచే

నివు నడువఁజాలవు. ఈయరణ్యమందు భయంకర వన్య మృగములెన్నోకలవు. ఆ మృగముల కంటఁ బడినచో, నపాయము సంభవింపఁగలదు. పొమ్ము.

సావిత్రి:—దండధరా! నిర్దయుఁడవై నన్నిట్లు తృణీకరింప నగునా? దైవము నెడలను, పతియెడలను నిర్మల మగు భక్తి కలదానను. నాకు పతిభిక్ష పెట్టుము.

యముఁడు;—రమణీమణీ! ఎన్ని విధములఁ జెప్పినను నీవు విన వైతివి. ఇఁక నేనిందు తడయఁదగదు. నీపతిప్రాణముల దక్క వేఱొక వరము కోరుకొనుము. నన్ను బాధింపకుము.

సావిత్రి:—యమధర్మరాజా! నాతండ్రికి పుత్రసంతానము కలుగునట్లు వరమిమ్ము.

యముఁడు;—అట్లే యిచ్చితిని. తల్లీ! ఈ వరములకు సంతృప్తి చెంది వెడలిపొమ్ము.

సావిత్రి;—అయ్యా! కోరిన వరములన్నియు ననుగ్రహించితివి. నాపతిప్రాణములఁదప్పించి, దయచేసిన వరములవలన నాకేమి ప్రయోజనము? ఇరువు రపరిచితులు ఏడడుగులు కలిసి నడిచినంత మాత్రముననే మిత్రులగుదు రని పెద్దలు చెప్పుదురు. మనము

చాలదూరముకలిసి నడిచితిమి కావున మిత్రుల మైతి మి. నా యందనుగ్రహ ముంచి, నాభర్తను బ్రతికించుము.

యముడు:—అదిగో వైతరిణీనది. ఆనదిని దాటి రాజాలవు. పొమ్ము.

సావిత్రి వైతరిణీ నదినిదాటి నరకలోకమున బ్రవేశించెను. కాలుడు సావిత్రికి పాపముచేసినవారిని తన లోకములో నేరీతిని బాధించుచున్నారో చూడుమని చెప్పెను. యమిచెప్పినను వినక సావిత్రి భర్తప్రాణముల నిమ్మని బ్రతిమాలసాగెను.

యముడిట్లనియెను.

"సావిత్రీ! ఎంతచెప్పినను వినక తుదకు నాలోకమునకుఁగూడ వచ్చితివి. సకలధర్మములు తెలిసినదానవు. జీవులకు జననమరణములు సహజము. నీవెన్నివిధముల ప్రయత్నించినను తిరిగి భర్తను పొందజాలవు.

సావిత్రి:—అయ్యా! నాభర్తను బ్రతికించుకొనఁజాలని నా బ్రతుకేటికి? నాభర్తలేని యీచతుర్దశభువనములతో నాకేమిప్రయోజన మున్నది? సూర్యచంద్రులుగాని, భూమ్యాకాశములుకాని, యుండి యేమి లాభము? నాతుదిపలుకు లాలకించుము. మీరు నా

భర్తజీవమును నీయలేని. యీపదునాలుగులోకములు నశించుగాక! సూర్యచంద్రాదిగ్రహములు, పృథివ్యప్తేజోవాయురాకాశము లనుపంచభూతములు నశించుగాక! నీలోకము, నీవుకూడ నంతరింతురుగాక!

**యముఁడు;**—సావిత్రీ! ఆగుమాగుము. నీపాతివ్రత్యమహిమను మెచ్చితిని. నీపతిజీవించును. నీవు నూర్గురసుతులఁ గాంతువు. నీభర్త నాల్గువేలవత్సరములు రాజ్యమును పాలించును.

సావిత్రి;—మహాప్రసాదము. నేనిదే నాపతియున్నయెడ కేగుచున్నాను. మీకు నాహృదయపూర్వకాభివందనములు.

౫

సావిత్రి త్వరితగమనమున సత్యవంతుని మృతకళేబరము నుంచిన ప్రదేశమునకు వెళ్ళఁగా నతఁడు నిద్రనుండి మేల్కొనినట్లు లేచికూర్చుండెను. అతఁడు మృతిఁజెందినది మొదలు, తిరిగి జీవించినంతవఱకు జరిగినదంతయు సావిత్రి చెప్పఁగా, సత్యవంతుఁడు విస్మయము చెందెను. చీఁకటులెల్లెడల నాక్రమించుకొనుటచే నింటివద్ద తలిదండ్రులు తమ

కొఱకు వెదకికొనుచుందురేమోయని భయపడుచు సత్య వంతుఁడు భార్యతోఁ గూడ నింటికి వెడలెను. దృష్టిలాభ మునుఁబడసిన ద్యుమత్సేనుఁడు సావిత్రి వలన జరిగిన దంతయు విని పరమాహ్లాదము నొందెను. సాళ్వరాజ్యమునందలి పుర జను లేతెంచి, ద్యుమత్సేన సత్యవంతులఁ గొంపోయి; సత్య వంతుని పట్టాభిషిక్తునిఁ జేసిరి. సత్యవంతుఁడు చిరకాలము రాజ్యమేలెను.



# దమయంతి



పూర్వము విదర్భదేశమును భీమరాజను నృపాలుఁడు పరిపాలించుచుండెను. అతఁడు సంతానముకొఱకు దమనుఁ డను ఋషినిఁగూర్చి తపస్సు చేయఁగా నతఁడు సంతుష్టుఁడై దమయంతి యనుపుత్రికయును దముఁడు, దాంతుఁడు, దమనుఁడు నను కుమారులును జన్మించునట్లు వర మిచ్చి, యంతర్ధానము నొందెను. దమయంతి అద్వితీయమైన సౌందర్యముచే నొప్పారుచు, దేవకాంతలైన నామెతోఁ బోల్చుటకు దగరని ప్రఖ్యాతిఁగాంచెను.

ఈకాలముననే నిషధదేశమును వీరసేనుఁ డను రాజేలుచుండెను. ఆతనికి నలుఁడను కుమారుఁడు కలఁడు. ఆతఁడును అసమానమైన సౌందర్యమును గలిగియుండెను. సుగుణములకును, శౌర్యపరాక్రమములకును, నతఁడు ప్రసిద్ధి చెంది యుండెను. ఒకనాఁ డాతఁ డుద్యానవనమున విహరించుచు దమయంతీదేవి సౌందర్యమును గుఱించి తలంచుకొనుచుండఁగా, నొక హంసలగుంపు వానిముందు వ్రాలెను. ఆతఁ డా

హంసలనుబట్టుకొనఁ బోయెను. ఒకహంస మాత్రి మాతని చేతికిఁ జిక్కెను. మిగిలినహంస లెగిరిపోయెను. నలునిచేతికిఁ జిక్కినహంస మానవులు మాటలాడు రీతి నిట్లనెను.

"రాజా! దయయుంచి నన్ను విడువుము. నీకు మే లొనఁ గూర్చెదను. జగదేకసుందరియని ఖ్యాతి నొందిన దమయంతి యొద్దకువెళ్లి నీసౌందర్యాతిశయమును సుగుణములనువర్ణించి యామెకు నీయందు ప్రేమజనించునట్లు చేసెదను. సంశయింపక నన్ను విడిచిపెట్టుము."

నలుఁడా హంసపలుకులకు విస్మితుఁడై విడిచిపెట్టెను. ఆహంస అప్పుడ నింగికెగసి, తనతోడి హంసలగుంపునుజేరి, తిన్నగా విదర్భదేశాధీశుఁడగు భీమరాజుసౌధమును జేరెను. ఉద్యానవనమున విహరించుచున్న దయమంతినిఁ జూచి హంస యిట్లనియెను.

"కామినీ! నేను పెక్కుదేశములఁ దిరిగితిని. ఎందఱో రాకుమారులఁ జూచితిని. నిషధదేశాధిపతియగు వీరసేన కుమారుఁడు నలుఁ డందఱికంటె సుందరుఁడు, సుగుణశాలి, శౌర్యోపేతుఁడు. ఆతఁడు నీయెడ నగ్గలమైన ప్రేమకలిగి యున్నాఁడు. కావున వానినే తప్పక పరిణయంబయి సుఖింపుము."

ఇట్లని యాహంస తనతోడిహంసలతోఁ గలిసి యెగిరి పోయెను.

౨

కొలఁదిదినములు గడచిన పిమ్మట భీమరాజు శుభ ముహూర్తము నిశ్చయించి దమయంతి స్వయంవరమును చాటింపించెను. వివిధదేశముల నేలు రాజులు దమయంతీ స్వయంవరమహోత్సవమునకు కేతెంచిరి. నలుఁడుకూడ స్వయంవరమునకు బయలుదేరెను. నారదునివలన దమయంతి సౌందర్యమునుగూర్చి విని ఇంద్రాగ్నియమవరుణులుకూడ స్వయంవరమునకుఁ బయనమైరి. మార్గమధ్యమున వారు నలునిఁ గలిసికొని యిట్లనిరి.

"నలరాజా! నీవు మాకొక్క యుపకారము చేయఁ గలవా?"

నలుఁ డందుల కంగీకరింప వా రిట్లనిరి. 'రాజా! మేము దమయంతిని వివాహ మాడుతలంపుతో నేతెంచుచున్నారము. నీవు దమయంతీదేవి యంతఃపురమునఁ బ్రవేశించి యామె మానలువురిలో నెవ్వరి నైన వివాహము చేసికొనుట కంగీకరింపఁ జేయవలయును."

నలునితలపైఁ బెద్దపిడుగు పడినట్లయ్యెను. ఆతఁడు వారి నుద్దేశించి యిట్లు వచించెను.

"మహాత్ములార! మీరు నన్ను పరీక్షించుచున్నట్లు తోఁచుచున్నది. నేనును మీవలెనే స్వయంవరమున దమ

యంతిని బొంద సేవించుచున్నాఁడను. నే నెట్లు మిమ్ముఁ గూర్చి మాటాడఁగలను?"

దేవతలు:— రాజా! నలుఁ డాడితప్పనివాఁ డని వింటిమి ఇదియేనా నీసత్యవాక్పరిపాలనము? చాలుచాలు.

నలుఁడు:— అయ్యా! సరే. మీకొఱకు వెళ్లెదను. కాని సురక్షితమగునంతఃపురము నెట్లు ప్రవేశింపఁగలను?

దేవతలు నలునిచేతి కదృశ్యగుళిక నిచ్చి 'దీనినిధరించి నీ వెరికినిఁ గనఁబడకుండ దమయంతీదేవి యంతఃపురముం జొచ్చి కార్యము సానుకూలముచేసికొనిర'మ్మనిరి.

నలుఁ డదృశ్యగుళికాప్రభావమున దమయంతీదేవి యంతిపురముం జొచ్చి, దేవతల సౌందర్యాతిశయంబును వేనోళ్ల బొగడి, వారిని బెండిచేసికొను మని దమయంతికి హితము చెప్పెను. దమయంతి యెన్ని చెప్పినను బెడచెవిని బెట్టి తనహృదయము నలునియందే లగ్నమైయుండెనని చెప్పెను. నలుఁ డామె తన్ను గాఢముగఁ బ్రేమించియుండెనని గ్రహించి, వర్ణింపనలవికాని యానందమునొంది, తానే నలుఁడ నని చెప్పి, యామె కాహ్లాద మొదవించి వెడలిపోయెను. తా నేగినకార్యము సానుకూలము కాలేదని యాతఁడు దేవతలతోఁ జెప్పెను.

వివిధములైన భూషణములచే నలంకరించుకొనిన రాజులతో నిండి సభ కనుల పండువుగ నొప్పుచుండెను. దమయంతి

పూలదండ చేతఁబూని చెలికత్తెతో నాసభామండపమునఁ బ్రవేశించెను. చెలికత్తె ప్రతిరాజు యొక్క చరిత్రనును దెలుప సాగెను. దమయంతి తుదకు నలునియొద్దకు వచ్చుసరికి, దేవేంద్రాదిదేవతలు నలురూపును నలునిరూపమునే ధరించి యుండుటచే నెవరునలుఁడో నిర్ణయింప వీలులేకుండెను. దమయంతి కేమిచేయుటకును దోఁచలేదు. ఆమె నిజమైన నలుని చూపించవలసిన దని దేవతల నతిదీనముగ వేడుకొనెను. వారికి జాలికలిగి తమనిజరూపముల ధరించిరి. దమయంతి నలునికంఠమున పుష్పహారమువైచెను. దేవతలు నలదమయంతుల కనేకవరము లిచ్చి వెడలిపోయిరి. కలిపురుషుఁడు దేవేంద్రాది దిక్పాలురవలన నీవివాహసమాచార మెఱింగి, నలునిపై క్రోధమువహించెను. నలుని రాజ్యచ్యుతునిఁగావించి, దమయంతీ వియోగమును కలిగింప నిశ్చయించెను. నలుఁడొకనాఁటి సాయంసమయమున నశుచియై యున్నప్పుడు కలిపురుషుఁడతని నావహించెను.

నలుని పినతండ్రికొమరుఁడైన పుష్కరుఁ డొకనాఁడు నలునితో జూదమాడెను. కలిపురుషుఁడు పుష్కరుని కనుకూలుఁడైయుండి, నలుఁడు రాజ్యము నోడిపోవునట్లుచేసెను. రాజ్యభ్రష్టుఁడైన నలుఁడు దమయంతిని పుట్టినింటికిఁ బొమ్మనెను. దమయంతి 'నాథా! సతికి పతియేగతిగదా. మీ

ధర్మాంగి నైనపుడు నేను మీసుఖదుఃఖములందు సమభాగ మును బంచుకొనవలదా? మీరు కాననములపాలై కష్టము లనుభవించుచుండ నేను పుట్టినింట నెట్లుసుఖముగనుందును? నేనుగూడ మి మ్మనుసరించెద?' ననెను.

నలదమయంతు లిరువురును కట్టుబట్టలతో వనమునఁ గందమూలముల భక్షించుచు కాలముగడపసాగిరి. ఒకనాఁడు వారాఁకటిబాధచే పరితపించుచుండ కలిచే పంపఁబడిన కొన్ని బంగారుపక్షులు గోచరించెను. నలుఁడు వానిని బట్టుకొను నుద్దేశముతో తనయుత్తరీయమును పైకివిసరగా నాపక్షు లా వస్త్రముతో నెగిరిపోయెను. దమయంతి తనతోఁగూడ నిద్రా హారములు లేక కష్టపడుచుండుట చూడఁజాలక యామెనట విడిచి వెడలిపోవనిశ్చయించుకొనెను. దమయంతియెటులయిన విదర్భదేశమును జేరునని యాతఁడు తలంచెను. ఈయుద్దేశ ముతో నలుఁడు దమయంతి నిద్రించుచున్న సమయమున యామెధరించినచీరలో సగముచించికొని వెడలిపోయెను.

## 3

దమయంతి నిదురనుండి మేల్కొని పతినిగానక వివిధ ముల విలపింపసాగెను. ఆమెరోదనముచే భూమ్యాకాశములు ప్రతిధ్వనించుచుండెను. భర్తను వెదకికొనుచు కొంతదూర మరుగ నామె నొకతాఁచుపాము మ్రింగుకొనియెను. ఆసర్పమును

జూచి దమయంతి కెవ్వున కేక వేసెను. ఇంతలో నొకకిరాతుఁ డేతెంచి యాపామును జంపి దమయంతిని రక్షించెను. కిరాతుఁడు దమయంతినిఁజూచి మోహించి, యామెను దనయింటికి రమ్మనగా నాపరమసాధ్వీలలామ యాతఁడు దగ్ధుఁడగునట్లు శపించెను. ఆమె పాతివ్రత్యప్రభావమున నాకిరాతుఁడు వెంటనే భస్మీభూతుఁ డయ్యెను.

దమయంతి మరికొంతద వ్వేగ నొక ఋష్యాశ్రమము కనిపించెను. ఆయాశ్రమములోని మునులను సమీపించి యామె 'మహాత్ములారా! నేనునిషధాధిపుఁడగునలుని భార్యను. దమయంతియనుదానను. నాభర్త నన్నీయడవిలో విడిచి యెందేగెనో తెలియుటలేదు. నేను నాపతినిఁగలిసికొందునా? ఈకష్టములనుండి యెన్నఁడైన మేమువిముక్తుల మగుదుమా? నన్ను కరుణించినాప్రశ్నములకు సమాధానమిం'డని ప్రార్థించెను. వారలామెయెడ కనికర మూని 'అమ్మా! నీభర్త నిన్ను కొలది దినములలోఁ గలిసికొనఁగలఁడు. కష్టములు కలకాలముండవు. ప్రతిమానవుఁడును కష్టసుఖముల సమానముగా ననుభవించును. పురాకృతకర్మవలన నీకష్టసుఖములు కలుగుచుండును. ఇవి మీదుర్దినములుకావుననే మీజీవితము లందిట్టిమార్పులు సంభవించినవి. నీవచిరకాలములోఁ దొల్లిటి వైభవము నందగలవు. నీకు శుభం బగుఁగాక' యని పలికిరి.

దమయంతి వారల సెలవుగైకొని మెల్లగానడచుచు చీఁకటిపడునప్పటి కొకసరోవరతీరమును జేరెను. అచ్చట

నామె యొకవర్తకులగుంపును గలిసికొనెను. ఆవర్తకు లామె చరిత్రమునువిని జాలిఁ బొందిరి. మరుచటిదిన ముదయమున దమయంతి చేదిపురమున కావర్తకులతోఁ బోయెను. ఆమె రాజవీధి ననుసరించి పోవుచుండఁగా చేదిపురాధీశుఁడైన సుబాహునృపాలుని తల్లిచూచెను. మార్గాయాసముచే బడలియడుగులుతడబడ మెలమెల్లన నేతెంచు దమయంతి దీనవదనమునుజూచి కనికర మొంది రాజమాత యామెనుబిలిచెను.

దమయంతి తననిజవృత్తాంతము నామెకుఁ దెలుపక తాను సైరంధ్రీవ్రతము నవలంబించితి ననియు, నావ్రతనియమములకు భంగముకలుగకుండ జూచునెడలఁ గొన్నాళ్ళట నుందుననియుఁ దెలిపెను. రాజమాత యందులకు సమ్మతించెను.

౪

దమయంతి నట్లరణ్యమధ్యమున విడిచిన నలుఁడు కొంతదవ్వేగ నొకచోట సర్ప మొండగ్నిలోఁబడి చనిపోవుటకు సిద్ధముగా నుండెను. ఆసర్పము నతఁడనలమధ్యమునుండి పైకిఁదీసి రక్షింప నయ్యది యాతనిఁగఱచెను. ఆపాము యొక్క విషము శరీరమందుఁ బ్రవేశించినంతనే యతఁడు వికారాకారము నొందెను. కాయము నల్లబారెను. ఆజానుబాహుఁడైన యతఁడు పొట్టివాఁ డయ్యెను. ఆసర్పము నలునిఁజూచి

'ఓరాజా! నేను కర్కోటకుఁ డను సర్పరాజును. కలిప్రేరణ మున నిన్నుఁ గఱచితిని. నన్ను తలఁచి కొనినంతనే నీవునిజ రూపమునొందఁగలవు. నీకు క్షుత్పిపాస లుండ' వనిచెప్పి మాయమయ్యెను.

నలుఁడు అయోధ్యానగరాధిపతి యైన ఋతుపర్ణునికడ కేగి తాను పాకశాస్త్రమునందును, అశ్వశిక్షణము నందును నేర్పరి నని తెలిపి నూఱువరహాలజీతమునకు కొలువుండెను.

ఇట్లుండఁగా భీమరాజు నలదమయంతులను వెదకి తోడ్కొనిరమ్మని వివిధదేశములకుఁ బ్రాహ్మణులఁ బంపెను. పర్ణాదుఁ డనుబ్రాహ్మణుఁడు చేదిపురమున రాజాంతఃపురమున సైరంధ్రీరూపమున నున్న దమయంతిని గుర్తించి, యామెను విదర్భదేశమునకుఁ గొంపోయెను.

దమయంతి నలునిజూడ లేమియుఁ దెలియకపోవుటచే నిరంతరము దుఃఖించుచుండెను. నిద్రాహారముల మానెను. నలుని వెదకుట కేగుబ్రాహ్మణులతో నామె కొన్నివాక్యము లను జెప్పెను. ఆవాక్యముల కెవరు సమాధాన మిత్తురో యాతఁడు నలుఁ డని గ్రహింపుఁ డని యామె వారితో చెప్పెను.

సుదేవు డనుబ్రాహ్మణుఁ డయోధ్యకుఁబోయి సతి కట్టుబట్టలో సగముచించి యామెను నట్టడవిలో నిర్దయుఁడై విడిచి వెడలిపోవుకఠినాత్ముఁ డెందైన నుండునా? సతి పతి కొఱకునిద్రాహారములుమాని కుందుచుండ నామెకుఁగాన్పించి

యీ మహాదుఃఖమును బోఁగొట్టని కఠినచిత్తుఁడెంతవాఁడైన నుండునా?" యని ప్రశ్నించెను. ఋతుపర్ణుని కొలువుకూటములోని సభికు లెల్లరు నూరకుండ బాహుకుఁ డనుమారుపేరుతో నున్న నలుఁ డిట్లనెను.

"భర్తయేకారణముచేనైన భార్యనునట్టడవిలో విడిచివెళ్ళి నను పతివ్రతయైన భార్య భర్తను నిందింపక సుదినము లెప్పటికైన రాకపోవునా యని వేచియుండవలెనుగాని యిట్లుపలుకుట తగదు."

సుదేవుఁ డీవాక్యములనుబట్టి, యతఁడు నలుఁ డనిగ్రహించి విదర్భకుఁబోయి దమయంతితో తానువినిన సమాధానమును దెలిపెను. భీమరాజదేవిని నలుని రప్పించుట కొకయుక్తినిఁ బన్నెను. ఆతఁడు దమయంతికి ద్వితీయస్వయంవరమని ప్రచురించి సుదేవుని చూలనయోధ్యకుఁ బంపెను. వివాహమహోత్సవాహ్వాన శుభపత్రికను దీసికొని, సుదేవుఁ డయోధ్యకేగి ఋతుపర్ణున కాలేఖనిచ్చెను. వ్యవధిలేనిముహూర్త మగుటచే వివాహమున కెట్లుపోఁగల నని ఋతుపర్ణుఁడు సందేహించుచుండ సుదేవుఁ డిట్లనెను.

"రాజా! నీయొద్దకొలువున్న బాహుకున కశ్వహృదయము తెలియునుగదా! సందేహమేల? విదర్భకు బయలుదేఱుము."

ఋతుపర్ణుఁ డీస్వయంవరవృత్తాంతమును నలునితోఁ దెలిపి రథము నాయితము చేయుమనెను. బాహుకుఁడు నిశ్చేష్టుఁ డై

దమయంతి యవిశ్వాసమున కాశ్చర్యపడుచు తేరును సిద్ధము చేసెను.

ఋతుపర్ణుఁడు, సుదేవుఁడు, నలుఁడు కుండిననగరమును జేరిరి. బాహుకుఁడను పేరుతోనున్న యతఁడు నలుఁడని నిర్ధరించుటకుఁ దగిన యాధారము లేమైన సేకరించుమని దమయంతి భారతి యనుపేరుగల తన చెలికత్తెతోఁ జెప్పెను. ఆమె నలుని కుమారుఁడైన ఇంద్రసేనునిఁ దీసికొని వంట చేయుచున్న బాహుకునియొద్ద కేగెను. బాహుకుఁడా బాలుని ముద్దుపెట్టుకొని బుజ్జగించుటవలనను, నీపే రెవ రని భారతి యడుగ నతఁడు పొరపాటున నలుఁడని చెప్పఁబోయి, బాహుకుఁ డనుటవలనను యామె బాహుకుఁడు, నలుఁడు నొకఁడే యని గ్రహించి దమయంతితోఁ జెప్పెను.

తదనంతరము భీమరాజు కోలు ప్రకారము ఋతుపర్ణుఁడు నలుఁడునుండ, సుదేవుఁడు సమీపించి యిట్లనెను.

"నలరాజా! ఈస్వయంవరము నిజమని నమ్మితివా? ఆనాఁడు నీవు చెప్పిన సమాధానమువలన నీవు నలుఁ డవని గ్రహించి నిన్నిటకు రప్పించుటకే యీయుక్తినిఁ బన్నితిమి. రమ్ము. నీ సతి నేలుకొనుము. నీవు నలుఁడ వని నిరూపించుటకెన్నో యాధారములు లభించినవి. స్వయంవరవృత్తాంతము వినిన పుడు నీవుపొందిన వేదనమును జూడ లేదా! నీయశ్వశిక్షణ కౌశల మొక నిదర్శనము కాదా? ఇంద్రసేనుని బుజ్జగించు నపుడు పలికిన పలుకుల యర్థమేమి?"

నలుఁడు కర్కోటకునిఁ దలఁచినంతనే, నిజరూపమును ధరించెను. ఋతుపర్ణుఁడు తనయొద్ద వంటలవాఁడై బాహుకుఁ డనుపేరుతో నున్నయతఁడు నలుఁడని తెలిసికొని యాశ్చర్యము నొందెను. నలుని రప్పించుటకుఁ జేసిన యీమోసమున కన్యథా తలంపవలదని భీమరాజు ఋతుపర్ణుని వేడుకొనెను.

నలదమయంతు లిరువురును గలిసికొనిరి. కలిపురుషునిదోషము నలుని బాసెను. ఆతఁడు పుష్కరుని మఱలజూదమున నోడించి నిషధరాజ్యమును గైకొని, ప్రజానురంజకముగ చాల కాలము రాజ్యమును బరిపాలించెను.



# చంద్రమతి



కోసలరాజ్యమును త్రిశంకుని కుమారుఁడైన హరిశ్చంద్రుఁడు పరిపాలించుచుండెను. హరిశ్చంద్రుఁడు సత్యముతప్పనివాఁడని, యెల్లరచే స్తుతింపఁ బడుచుండెను.

ఇట్లుండఁగా, దేవలోకమున నొకనాఁడు దేవేంద్రుఁడు వశిష్ఠ, విశ్వామిత్ర, నారదాదిముని బృందముతో నిండియున్న సభలో నిట్లనెను.

"మునీంద్రులారా! భూలోకమునఁ గలరాజులలో నసత్యమాడని వాఁ డెవ్వఁడైననున్నాఁడా?"

వశిష్ఠుఁడు లేచి 'అమరనాథా! కోసలరాజ్యాధీశుఁడైన హరిశ్చంద్రుఁడను సత్యశీలుఁడు భూలోకమునఁ గల" డనెను.

విశ్వామిత్రుఁడు లేచి, సభికుల నుద్దేశించి, యిట్లనెను.

"ఆర్యులారా! వశిష్ఠుఁడు పల్కిన దసత్యము. భూలోకమున సత్యముపలుకువారు లేనే లేరు. హరిశ్చంద్రుఁడు సత్యసంధుఁడు కానేరఁడు. వలయుచో, నతనిచే నే నసత్యము పలికింతును."

వశిష్ఠ విశ్వామిత్రు లిరువురు వాదులాడిరి. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచే నసత్యము పల్కించినచో వశిష్ఠుఁడు తన తపశ్శక్తినిధారవోయుదు ననెను. వశిష్ఠుఁడు గెలిచినచో విశ్వామిత్రుఁడు తన తపశ్శక్తిని ధారవోయుదు ననియెను. ఓడిపోయినవారు గాడిద నెక్కియూరేగునట్లుకూడ నిర్ణయింపఁబడెను. ఈవిధముగా శపథములఁ బలికి వశిష్ఠవిశ్వామిత్రులు దేవేంద్రసభనుండి వెడలిపోయిరి.

౨

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచే నెట్లయిన నబద్ధ మాడింపనెంచి మర్త్యలోకమున కరిగెను. మొట్టమొదట నతఁడు హరిశ్చంద్రు నొద్దకుఁబోయి యి ట్లనెను.

"రాజేంద్రా! నే నొక యాగ మొనరింపఁ దలఁచినాను. ఆయజ్ఞము చేయుటకు చాలధన మవసర మై యున్నది. నీవు నా యవసరమును దీర్పఁ గల వనునమ్మికతో నిచటికేతెంచితిని."

హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రు నుద్దేశించి యిట్లు పలికెను.

"మునీంద్రా! మిమ్ముఁ బోలిన మహర్షుల కోరిక నిరాకరింతునా? తమ కెంతధనము కావలసియున్నను యిచ్చుటకు సిద్ధముగ నున్నాఁడను."

విశ్వా:—నశేందా్రీ! బలముకల మనుజుఁ డొకఁ డేనుఁగు
నెక్కి గవ్వ నెగురవేసిన నెంతదూర మేగునో, యంత
యెత్తు ధనముకావలసియున్నది. ధనమిచ్చునపు డింత
ధనము నాకడలే దందు వేమో. ముందుగనే చెప్పు
చున్నాను.

ఎంతధనము కావలసినను నిరభ్యంతరముగఁ దీసికొనిపో
వచ్చు నని హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునిచో చెప్పఁగా
నతఁడు తన కాధన మవసర మైన నపుడు వచ్చి కొనిపోయెద
ననియు నంతవఱకు తనయొద్దనే దాచియుంచు మనియుఁ జెప్పి
వెడలిపోయెను.

హరిశ్చంద్రునిచే నట్లువాగ్దానమును గైకొనిన విశ్వామి
త్రుఁడు దుష్టమృగముల సృష్టించి, వానిని కోసలరాజ్యము
నందలి ప్రజలను బాధింపఁ బంపెను. ఆక్రూరమృగముల
బాధ ననుభవింపఁజాలక ప్రజలు తమ్మురక్షింపు మని హరి
శ్చంద్రభూపాలుని కడ కేగి మొఱపెట్టుకొనిరి.

ప్రజలక్షేమమే తన క్షేమమనియెంచు నాతఁడు సతి
యగు చంద్రమతితోను సుతుఁ డగు లోహితాస్యునితోను
పరివారముతోను వేఁటాడుట కడవికిఁ బోయెను. ఆయరణ్య
మున వారి కొకచోట బంగారులేడి కనఁబడెను. లోహి
తాస్యుఁ డాలేడినిఁ బట్టుకొని, తనకుఁ దెచ్చి యిమ్మని తం
డ్రిని కోరెను. హరిశ్చంద్రుఁ డాకనకమృగమును బట్టు
కొనఁబోవ నది చెంగుచెంగున గంతులిడుచు తిన్నగాబోయి

విశ్వామిత్రమహర్షి యాశ్రమ సమీపమున మాయ మయ్యెను.

ఇంతలో నాలేడి యెటు మాయ మయ్యెనా యని హరిశ్చంద్రు డిటునటు చూచుచుండ విశ్వామిత్రు డాశ్రమము నుండి యీవలికివచ్చి గంభీరస్వరమున నిట్లనియెను.

"రాజా! ఆశ్రమ మృగములను వేటాడుట దోష మని తెలియదా? జాగరూకుఁడవై మెలఁగుము. క్రూరమృగములఁ జంపుటకు మారుగ ఋష్యాశ్రమములందు విహరించుసాధుజంతువుల వేటాడి పాపమును మూటకట్టుకొనెదవా? రాజు లధర్మమార్గము ననుసరింతురనుమాట కల్లకాదు. పొమ్ము. ఇఁక ముం దెన్నఁడైన నిట్టియవివేకపుఁ బనులఁ జేసితివో మా శాపమునకు గుఱియగుదువు."

విశ్వామిత్రుని వాడిములుకులను బోలినపలుకులు హరిశ్చంద్రునిచిత్తమున గాఢముగ నాఁటి మిక్కిలి బాధ కలిగించెను. ఎఱుఁగక చేసిన తనతప్పును సైరింపు మని యా నృపాలుఁడు ఋషీశ్వరుని వేడుకొని, భార్యాసుతు లున్న చోటునకుఁ బోయెను.

## 3

విశ్వామిత్రుని కఠినవాక్యములచే హరిశ్చంద్రుని చిత్తము కలఁతఁ జెందెను. ఆతఁడు చంద్రమతి యంకతలమున తలనిడుకొని నిద్రించెను. ఆనిద్రలో నతఁడొక స్వప్నమును గాఁ

చెను. ఎవరో యొకఋషి వచ్చి పాదముతో తనకిరీటమును దన్ని నటులయ్యెను. వెంటనే యతఁ డులికిపడి లేచి తాను కలఁగనిన దెల్ల చంద్రమతి కెఱిఁగించెను. పతిహృదయమున కానందమును కలిగించుట కైన వినోదమును గల్పింపుమని చంద్రమతి మంత్రియైన సత్యకీర్తితోఁ జెప్పెను. ఆతఁ డావన మున నొకచోట నాటలాడుకొనుచున్న మాతంగ కన్యకలఁ దోడ్కొనివచ్చెను.

మాతంగకన్యకలు నృత్యగానములుచేసి హరిశ్చంద్రమహీ పాలునికి సంతోషముకలిగించిరి. ఆతఁడాకన్యకల కొక ము త్యాలహారమును బహుమానముగ నీయఁబోయెను. ఆమా లకన్నియలు రాజు తమ కొసంగఁ బోయిన ముత్యాలహార మును దీసికొనక యాతని శ్వేతచ్ఛత్రము నిమ్మనిరి. హరి శ్చంద్రుఁ డందులకు సమ్మతింపక యట్టిదుర్ఘటము లైన కోరి కలఁ గోరవల దనియెను. అంత నామాతంగకన్యకలు హరి శ్చంద్రునితో నిట్లనిరి.

"రాజేంద్రా! మేము కోరిన తెల్లగొడుగు నీయకున్న మానె. మమ్ము పెండ్లియాడుము."

హరిశ్చంద్రుఁ డందులకుఁగూడ నంగీకరింపక వారు వాం ఛింపఁదగనికోర్కెలఁ గోరుచుండుటచే నావలకు సాగనంపు మని మంత్రితోఁ జెప్పెను. మంత్రియాకన్నియల నటనుండి వెడలిపోవలసిన దని యెన్నివిధములఁ జెప్పినను వినకపోవు టచేవారలఁ గొట్టి తఱిమెను.

మంత్రిచే శిక్షింపఁబడిన మాతంగకన్యక లేడ్చుచుఁబోయి తమకుజరిగిన పరాభవమును విశ్వామిత్రుని కెఱిఁగించిరి. విశ్వామిత్రుఁడు కోపముతో మండిపడుచు హరిశ్చంద్రుని కడ కరిగి యిట్లనెను.

"హరిశ్చంద్రా! రాజ్యమును, సంపదలనుజూచికొని మిడిసిపడుచున్నావు. నాకన్యకలఁ బెండ్లియాడెదవా? లేదా?"

కనుల నగ్నికణములు వెడలఁగ్రక్కుచున్న విశ్వామిత్రునిఁ జూచి హరిశ్చంద్రుఁడు భయపడెను. అతఁ డాఋషిపాదముల పైఁబడి తనతప్పుక్షమింపు మనెను. గాధినందనుఁ డాతని కిరీటమును దనపాదముతోఁ దన్ని తన కుమార్తెల తప్పుక పరిణయము చేసికోవలె నని చెప్పెను.

హరిశ్చంద్రుఁ డా ఋషినిఁ జూచి యిట్లువచించెను.

"మానిచంద్రమా! ప్రసిద్ధమైన సూర్యవంశము నందు జన్మించిన క్షత్రియుఁడను. ఏకపత్నీవ్రతుఁడ నగుటచే తమ పుత్రికల పెండ్లియాడఁజాలను. నారాజ్యమంతయును గోరవలసినచో, కోల్పోవుదును గాని కులశీలములవిడువఁజాలను"

అట్లయినచో రాజ్యము నీయవలసిన దని విశ్వామిత్రుఁ డనెను. హరిశ్చంద్రుఁ డణుమాత్రమైన సంశయింపక తన రాజ్యమంతయు నాఋషీశ్వరునకు ధారవోసెను. రాజ్యమును ధారవోయించుకొనిన యనంతరమతఁడు వెనుక తనకు యాగార్థముదాన మిచ్చిన ధనము నీయవలసిన దని నిర్బంధించెను.

హరిశ్చంద్రుఁ డా ఋషి పలుకుల నాలకించి విస్మితుఁ డాయెను. గాధిసుతు నుద్దేశించి యాతఁ డిట్లనెను.

"మహానివతంసమా! నారాజ్య మంతయును మీకు సమర్పించితిని. వెనుక నేను మీ కొసంగినధనము కూడ నీరాజ్యములోనిదే కదా! ఇపుడు మఱల ధన మడిగెద రేమి?"

విశ్వా:— ఏమీ! ధన మే మని యడిగెదవా? నీవు వెనుక నిచ్చిన ధనమునకును రాజ్యము ధారవోయుటకును సంబంధ మేమి కలదు? పోనిమ్ము. ఆధనము నీయనునుము. చాలును.

హరి:— ఆర్యా! ఈయవలె ననినచో తప్పకయిచ్చెదను గాని యనృత మాడఁజాలను. నిర్ధనుఁడనై, రాజ్యచ్యుతుఁడనైన నే నెట్లంత ధనమునీయఁగలను?

విశ్వా:— నాశిష్యుఁ డగునక్షత్రకుని నీతోఁ బంపెదను. వానిని నీకుమారునివలె జాగరూకతతోఁ గాపాడుచు నా ధనము చేకూరినంతనే యాతనిచేతికిచ్చి పంపుము. నీకొక మాసము గడు విచ్చితిని.

ఇట్లని యాఋషీశ్వరుఁడు తన శిష్యుఁ డగు నక్షత్రకునితో మార్గమధ్యమున వారి ననేక బాధలపాల్జేసి, హరిశ్చంద్రునిచే నెట్లయిన నసత్యము పల్కించు మని చెప్పి వెడలి పోయెను.



౪

హరిశ్చంద్రుఁడు సతీసుతులతో వారణాసికిఁ బయన
మయ్యెను. మార్గమధ్యమున నక్షత్రకుఁడు గురుబోధనము
ననుసరించి వారి నెన్నోవిధముల బాధించెను. విశ్వామిత్రుఁ
డును వారికిఁ గనబడకుండ వారివెంటనే పోవుచుండెను. ఒక
చోట నతఁడు వర్షమును గురిపించెను. మింటికి మంటికి నేక
ధారగా నావర్షము కురియుచున్నను హరిశ్చంద్రుఁడు చలింప
లేదు. విశ్వామిత్రుఁడు దంతఘాతుఁ డను రక్కసుని బిలిచి
హరిశ్చంద్రుఁ డారాత్రి బేతాళవటము క్రింద విశ్రమించునట్లు
చేయుమనెను. ఆరాక్షసుఁడు మునివలె వేషముధరించుకొని
యొకచోటఁ గూర్చుండఁగా, హరిశ్చంద్రాదులరుదెంచిరి. హరి
శ్చంద్రుఁ డాకపటఋషికి నమస్కరింపఁగా నతఁడు హరిశ్చం
ద్రుని పూర్వవృత్తాంతమును జెప్పి యతనికి తనయందు నమ్మ
కము కుదురునట్లుచేసెను. హరిశ్చంద్రుఁ డాకపటమునినిఁజూచి
"అయ్యా! తమకమండలమునఁ గొంచెము జల మున్నదా"
యనియడుగ నతఁడచటి కనతిదూరముననే యొకజలాశయము
కలదని చెప్పెను. హరిశ్చంద్రుఁడు భార్యాపుత్రులను నక్ష
త్రకుని, యా సరోవరము కడకుఁ గొంపోయెను. వారచట
నీరములఁ గ్రోలి బేతాళవటము క్రింద విశ్రమించిరి.

చంద్రమతీలోహితాస్యులును నక్షత్రకుఁడు నిద్రించు
చుండఁగా హరిశ్చంద్రుఁడు వారల కేయాపదయుఁ గలుగ

కుండ కాచుచుండెను. ఇంతలో నానుఱ్ఱిచెట్టుమీఁద నున్న పిశాచములన్నియుఁ గ్రిందికివచ్చి వారిపైఁ బడ నుంకించెను. హరిశ్చంద్రుఁడు తనకత్తితో వారిచెక్కులు, ముక్కులు చెక్కి పంపెను. ఆభూతము లంత గొంతెత్తియేడ్చుచుఁబోయి తమ యజమానుఁ డగుబేతాళునితోఁ జెప్పఁగా నతఁడు రోష ముతో మండిపడుచు వచ్చెను. సతీసుతులకు నిద్రాభంగము కాకుండ హరిశ్చంద్రుఁడు బేతాళుని దూరముగఁగొంపోయి వానితో పోరాడి, వధించెను.

తెల్లవాఱినపిదప వారు మఱల తమ ప్రయాణమును సాగించిరి. కొంత దూర మేగు నప్పటికి దావానలము వారినిఁ జుట్టుముట్టెను. ఆ యగ్నినుండి తప్పించుకొనుట కేవెఱవును గానక వా రాలోచించుచుండ చంద్రమతి యాయగ్నిని ప్రా ర్థించుచు నందు దుమికెను. అనలము చల్లారెను. చంద్రమతి తన్నపాతివ్రత్యమహిమవలన నిరపాయముగ నీవలికి వచ్చెను.

తరువాత వారు కాశీనగరమునకుఁ బోయి గంగానదిలో స్నానముచేసి, విశ్వేశ్వరుని పూజించిరి. నక్షత్రకుఁడు తన గురువున కీయవలసిన ఋణధనము నిమ్మని వివిధముల నిర్బం ధింప, చంద్రమతి తన్నెవరికైన దాసిగా విక్రయించి యా ధనముతో ఋణముం దీర్చు మనెను. హరిశ్చంద్రుఁడు చేయు నదిలేక యందుల కొడంబడెను. ఆఁ తడా పుర వీ ధు లలోఁ దిరుగుచు తన సతి నమ్మెద నని కేకలువేయుచుండ నవి విని కాలకౌశికుఁడు వచ్చి యామెను కొనెను. చం ద్రమతి నిర్భర మగుదుఃఖముతో పతినిబాసి వెడలిపోయెను.

౫

హరిశ్చంద్రుడు కాలకౌశికు డొసంగిన ధనమును నక్షత్రకుని కిచ్చెను. నక్షత్రకుఁ డాధనము తనదారిబత్తెము క్రిందఁ జూచుకొంటి ననియు గురుని ఋణధనము నీయవలసి నదనియు నిర్బంధించెను. హరిశ్చంద్రుఁ డాతని పలుకుల నాలించి నిశ్చేష్టుఁ డయ్యెను. అతఁడీకష్టములకుఁగారణము తన పూర్వజన్మకృత పాపఫలంబనియు నెట్టివారికిని పురాకృతకర్మ ఫలము ననుభవించుట తప్ప దనియుఁ దలంచి తన్నెవరికైన విక్రయించి యాసొమ్మునుగూడ దీసికొనుమని నక్షత్రకునితోఁ జెప్పెను.

నక్షత్రకుఁడు హరిశ్చంద్రునుద్దేశించి "నీధనము నీయఁనక్కఱలే దని యొక్క మా టనఁగూడదా? ఎందులకీ కష్టముల ననుభవింతు" వనెను. హరిశ్చంద్రుఁడు ప్రాణములఁ గోల్పోవుటకైన సమ్మతించెదను గాని యబద్ధ మాడఁజాల ననెను.

నక్షత్రకుఁడు హరిశ్చంద్రుని వీరబాహుఁ డను చండాలుని కమ్మి, యాధనమును గైకొని వెడలిపోయెను. వీరబాహుఁడు హరిశ్చంద్రునికి వీరదాసను పే రిడి తనయధీనమునందున్న శ్మశానమునకుఁ గాపరిగ నియమించెను. తన దుస్థితికి విలపించుచు హరిశ్చంద్రుఁడు కాటికాపరియై కాలము గడప సాగెను.

౬

చంద్రమతి లోహితాస్యునితో కాలకౌశికుని గృహమున కేగెను. కాలకౌశికుని భార్యయగు కలహాకంఠి యామెచే ననేకవిధనుల నూడిగము చేయించుకొనుచుండెను. ఎంతయో పికతో నామె సేవ చేయుచున్నను, యేదోయొక నేరమును గల్పించి కలహాకంఠి చంద్రమతిని నిందించుచుండెను.

ఒకనాఁడు కలహాకంఠి లోహితాస్యుని తక్కుంగల బాలురతో వనమునకుఁబోయి దర్భలనుకోసితెమ్మని పంపెను. లోహితాస్యుఁడొక చిన్నగుట్టనెక్కి దర్భలఁ గోయుచుండఁగా పాము కఱచెను. వెంటనే యాబాలుఁడు కెవ్వనకేక వేసి మరణించెను. ఆతనితో నరుదెంచిన బాలురందఱును తమ మిత్రుఁడైన లోహితునకు సంభవించిన యాపద కెంతయు విచారించి యింటికిఁబోయి చంద్రమతితోఁ జెప్పిరి.

చంద్రమతి వర్ణింపనలవికానిదుఃఖము నొందెను. ఆమె తనపుత్రునిఁ జూచుటకు వెళ్లెదననికలహాకంఠితోఁ జెప్పఁగా నామె నిర్దయురాలై యింటిపనియంతయుఁజేసి చీకటిపడిన పిదప వెళ్లుమనెను. చేయునది లేక లేక యామె పగలంతయు నింటిపనులఁజేసి చీకటి పడినతరువాత వెళ్ళెను. ఆమె యరణ్యములో సుతుని మృతకళేబరమును కనుగొని, గోలుగోలున నేడ్చెను. కొంతసేపువిలపించి యూఱటఁజెంది యామె

పుత్రుని కళేబరమును బుజముపై నిడికొని దహనక్రియల నెరవేర్చుటకు శ్మశాన వాటికకు బోయెను. చంద్రమతి తన కుమారునికళేబరము నొకచోట నుంచి చితుకుల నేరి వానిపై నిడి యగ్నిని ముట్టించెను. ఇదిచూచి వీరదాసను పేరుతో కాటికాపరిగ నున్న హరిశ్చంద్రుడేతెంచి కాలితో నాచితిని దన్ని యిట్లనెను.

"ఓపడతీ! నీకీ శ్మశానముయొక్క పద్ధతులు తెలియ నట్లున్నది. కాటికాపరినైన నాయనుమతిగైకొనక కాటిసుంకము చెల్లింపక దహనము చేయుచున్నావు. పొమ్ము పొమ్ము."

చంద్రమతి;—అయ్యా! దిక్కులేనిదానను. కాటిసుంకము చెల్లించవలెనని తెలియదు. నిఱుపేదనగు నాకడ ధనమేమియును లేదు. ఓదయామయా! నన్ను కరుణించి నాపుత్రుని దహనము చేసికొననిమ్ము. నీకెంతైన పుణ్యముండును.

హరి:—నీకడ ధన మేమియు లేదా? నీవెవతెవు? నీకుమారుడెవ్వడు?

చంద్రి:—అయ్యా! నేనెవ్వతెనైననేమి? చతుస్సముద్ర ముద్రితమహీతలము నేలు రాజేంద్రుని నందనునకీనాడెట్టి దుర్గతి కలిగినది? అకటా! కాలమహిమ.

హరిశ్చంద్రుడు చంద్రమతి పలుకుల నాకర్షించి నివ్వెఱపోయెను. ఆమెనుజూచి యాతడిట్లు లనియె.

సాధ్వీమణీ! నీ కుమారుడు రాజేంద్రుని పుత్రుడందువి. ఆతడెవరు? ఈ బాలుడు పుత్రుడగునా? రాజేం

దుని భార్య వైన నీ యొద్ద ధనము లేదనినచో నెవ్వరు నమ్మెదరు? ఒకమాడయు తెచ్చి యియ్యము నీయఁజాలవా?"

చంద్రమతి:— ఓపుణ్యపురుషా! నా మాట నమ్ముము. నిజముగా నేను మిక్కిలి హీనస్థితిలో నున్నాను.

హరిశ్చంద్రుఁ డామె నొకసారి తేఱిపాఱఁజూచి యిట్లనెను. "నారీమణీ! నీకంఠమున మాంగల్య మున్నదిగదా! అది విక్రయించి, ధనము తీసికొనిరమ్ము పొమ్ము."

చంద్రమతి యాతని మాటలను విని యులికిపడియెను. తనమంగళసూత్రము పతికిఁ దప్ప మఱెవరికి నెప్పుడును గానరాదని వశిష్ఠుఁ డామె కొకానొకప్పుడు చెప్పియుండెను. ఆమహానుభావుని వాక్యము వృథా కాఁగూడదు. లేదా యీ కాటికాపరి హరిశ్చంద్రుఁ డైయుండవలయు ననియామె తలంచి తనయెదుటనున్న కాటికాపరి నొకసారి తలయెత్తిచూచెను. చంద్రమతీహరిశ్చంద్రు లిరువురు నొకరి నొకరు గుఱుతింపు కొనిరి. మరణించినది లోహితాస్యుఁడే యని తెలిసికొని హరిశ్చంద్రుఁడు మిక్కిలి వగచెను. కొంతసేపైన పిదప నతఁడు తన సతీమణికిట్లనియెను.

'సతీ! నేను కాటికాపరిని. నాయజమాని వీరబాహుని యనుమతిఁ గైకొనక మనము శవదహనము చేయరాదు. నీవు పురములోని కేగి, నీయజమాను నడిగి, ధనము తెమ్ము."

చంద్రమతి యట్లే యని యూరిలోనికిఁ బోవుచుండఁ గొందఱు దొంగలు పరుగుపరుగున వచ్చుచుండిరి. వారిని రక్షక

భటులు తలుముకొని వచ్చుచుండిరి. తస్కరులు తమకడ నున్న యాభరణముల నామె ముందుపారవైచి వెడలిపోయి రి. ఇంతలో నారక్షకభటు లక్కడకువచ్చి, యామెముందు నగలుండుటచే నామెయే వానిని దొంగిలించి రాజకొమ రుని చంపివేసిన దని తలంచి యామెను రాజు కడకుఁ గొంపోయిరి.

రా జామెను వీక్షించి, కోపారుణనేత్రుఁడై, తలవరుల జూచి 'ఓరీ! ఈదుష్టురాలినిఁ గొంపోయి, తల నఱికించు" డని యాజ్ఞాపించెను.

తలవరు లామెను గొంపోయి వీరదాసనుపేరుతోనున్న హరిశ్చంద్రున కామెను వప్పఁజెప్పి, రాజాజ్ఞను తెలిపి, వెడలిపోయిరి.

జరిగినదంతయు చంద్రమతి చెప్పఁగా, హరిశ్చంద్రుఁడు విని, చింతించి యి ట్లనెను.

"సతీమణీ! నీవునిర్దోషురాలవే యగుదువుకాని రాజాజ్ఞ న నుల్లంఘునీయము. రాజాజ్ఞ ననుసరించి నిన్నువధించెదను. సిద్ధ ముగ నుండుము."

ఇ ట్లని యాతఁడు కత్తి విసరెను. చంద్రమతి చావలేదు. ఆతఁడు విస్మితుఁడై "నేను నిజముగా ధర్మమునే యనుసరించు చున్నవాఁడనగుదునేని యీసారి యీామె కంఠము తెగునుగాక" యని మరల కత్తి విసరఁబోవ విశ్వామిత్రుఁడును శంకరుడును

వశిష్ఠుండును వచ్చి వారించిరి. హరిశ్చంద్రుని సత్యసంధతకు మెచ్చి విశ్వామిత్రుఁడు లోహితాస్యుని బ్రతికించెను. దేవేంద్రసభలో జరిగిన నిర్ణయముప్రకారము ఆతఁడు తనతపస్సులో సగము వశిష్ఠునకు ధారపోసెను. హరిశ్చంద్రుఁడు మరల రాజ్యమునుపొంది ప్రజలు హర్షించునట్లుగా పాలింపసాగెను. చంద్రమతి పాతివ్రత్యము నెల్లరు కొనియాడసాగిరి.



# సీత



మిథిలానగరమును జనకమహారాజేలుచుండెను. ఆతడు చిరకాలము సంతానము లేకయుండెను. ఆతఁడు సంతానము కలుగుట కొఱకు గొప్పయజ్ఞము చేయఁబూని తానే భూమిని దున్నుచుండెను. ఆతఁడట్లు వసుంధరను దున్నుచుండఁగా, నొకపెట్టెకనబడెను. ఆపెట్టె తెఱచిచూడ నందొక యాఁడు శిశువుండెను. ఆశిశువు నాతఁ డింటికిఁ గొంపోయి సీతయని పేరిడి మిక్కిలి గారాబముతోఁ బెంచుకొనసాగెను.

సీత శుక్లపక్షమునందలి సుధాకరునివలె దినదినప్రవర్ధమాన యయ్యెను. సకలశాస్త్రములుచదివెను. ఆమెపెద్దదై వివాహయోగ్య అయ్యెను. జనకమహారాజామెకు పెండ్లిచేయతలంచెను. తనయింటనున్న శివధనుస్సు నెక్కిడినవీరునకు సీత నిచ్చి పరిణయము కావింతునని యతడు చాటింపించెను. సీతయొక్క యసమానసౌందర్యమునుగుఱించి వినిన రాకుమారులెందఱో యామెను జేఁబట్ట నరుదెంచిరి. పురాతనమైన శివధనుస్సు నెక్కిడజాలక వారందఱు వెడలిపోయిరి.

౭

కోసలదేశాధీశ్వరుఁ డగు దశరథుఁడు పుత్రకామేష్టియను యజ్ఞమును జేయఁగా, యజ్ఞపురుషుఁడు ప్రత్యక్షమై పాయసముతోనిండిన గిన్నె నిచ్చి యి ట్లనెను.

"రాజా! ఈపాయసమును నీభార్యలకిమ్ము. నీకు సంతానముకలుగును."

దశరథుఁ డానందముతో నాపాయసమును తనభార్యలగు కౌసల్యా కైకేయీ సుమిత్రల కొసంగెను. వా రద్దానిం ద్రావిరి. కాలక్రమమున వారు గర్భవతులై, నవమాసములు గడచినపిమ్మట నల్వురుపుత్రులను గనిరి. దశరథుఁడు తన నందనులకు రామలక్ష్మణభరతశత్రుఘ్నులని పే రిడెను.

రామలక్ష్మణభరతశత్రుఘ్నులు దినదినాభివృద్ధినొందిరి. విలువిద్యయందు వా రాఱితేరిరి. ఒకనాఁడు విశ్వామిత్రుఁడు దశరథుని కడ కరిగి తానొక యాగమును జేయబూనితి ననియు దుష్టులగు రక్కసులు విఘ్నములు కలిగించుచున్నా రనియు నిర్విఘ్నముగ కొనసాగించుటకు రామలక్ష్మణులఁ బంపవలసినదనియునడిగెను. మొట్టమొదట దశరథుఁడందులకు అంగీకరింపడయ్యెను. వశిష్టుఁడు చెప్పఁగా నెట్టకేలకు సమ్మతించి యతఁడు రామలక్ష్మణులను విశ్వామిత్రునివెంటఁ బంపెను.

విశ్వామిత్రుని వెంట నేగిన రామలక్ష్మణులు తాటకి యను రక్కసిని, మారీచసుబాహులను రాక్షసులను జంపిరి. విశ్వామిత్రమహర్షి యజ్ఞము నిర్విఘ్నముగ జరిగెను. ఆతఁడు వీరిని మిథిలానగరమునకుఁ దోడ్కొనిపోయెను. మార్గమధ్యమున నాతఁడు వారలకు అనేకదివ్యాస్త్రముల ప్రయోగించు రహస్యములను దెలిపెను. విశ్వామిత్రరామలక్ష్మణులు జనకమహారాజింటికిఁ బోయిరి. ఎందఱోవీరు లెక్కుడఁజాలని శివధనుస్సును రాముఁడవలీలగ నెత్తి నారి లాగుసరికి ఫెళఫెళమని యదివిఱిగిపోయెను. జనకమహారాజు నిరవధికానందముఁ జెందెను. దశరథమహారాజు బంధుమిత్ర పరివారసమేతముగా మిథిలకేగెను. సీతారాములకళ్యాణము మహావైభవముగజరిగెను. ఆసమయముననే భరతలక్ష్మణశత్రుఘ్నులకుఁ గూడ వివాహములయ్యెను.

వివాహానంతరము వారు అయోధ్యకుఁబోయిరి. అయోధ్యకుఁ బోవుమార్గమున శ్రీరాముఁడు పరశురామునివిల్లు కూడ నెక్కిడి యాతనికి గర్వభంగముచేసెను.

3

దశరథమహారాజు తానువృద్ధుఁ డగుటచేతను, శ్రీరామచంద్రుఁడు యుక్తవయస్కుఁ డగుటచేతను రాజ్యమునకు రామచంద్రుని పట్టాభిషిక్తునిఁజేసి తాను వనమునకుఁబోయి

తపముచేసికొన నెంచెను. ఈయుద్దేశముతో నతఁడు పట్టాభిషేకప్రయత్నములఁ జేయఁదొడగెను. ఈవార్త కైకేయి దాసియగుమంధర వినియెను. ఆమె కుత్సితురాలు. రాముఁడన్న నామెకుఁ గిట్టదు. అతఁడు పట్టాభిషిక్తుఁ డగుట కోర్వఁజాలక ఆమె కైకదగ్గఱకువెళ్లి లేనిపోని నేరములఁ గల్పించి చెప్పెను. కైక దశరథుఁడుతనకు శంబరాసురయుద్ధసమయమున వాగ్దానముచేసిన రెండువరముల నీయవలసిన దని మంధర ప్రేరేపింపఁగా నడిగెను. అవ్వియెవ్వియని దశరథుఁ డడుగ నామె భరతునకుఁబట్టముకట్టు టొకటనియు, రాముఁడు పదునాలుగేండ్లు వనవాసము చేయు టొకటనియుఁ జెప్పెను. కైక పలుకులనాలకించి దశరథుఁడు మూర్ఛపోయెను.

శ్రీరామచంద్రుఁడు తండ్రికినిదల్లికిని జరిగిన సంభాషణము విని పితృవాక్యపరిపాలనార్థ మడవికిఁ బోవసమకట్టెను. సీతయు, లక్ష్మణుఁడు నతని ననుసరించిరి. దశరథమహారాజు శ్రీరాముఁడు వెడలిపోయినపిదప మరణించెను.

౪

సీతారామలక్ష్మణులు మువ్వురును సరయూనదిని దాఁటి, చిత్రకూటపర్వతమునుఁజేరి విశ్రమించిరి. [illegible]ని ట్లుండగా మేనమామయింటికిఁబోయిన భరతశత్రుఘ్నులు అయోధ్యకు తిరిగి వెళ్లి తండ్రిమరణించెననియు, తమ యగ్రజుఁడు

సీతాలక్ష్మణసమేతముగ నడవికిఁ బోయెననియుఁ దెలిసికొని మిక్కిలి విచారించిరి. కైక పట్టముకట్టుకొని రాజ్యమేలుమని భరతునితోఁ జెప్పఁగా, నతఁడాగ్రహము చెంది నాకు రాజ్య మక్కరలేదని మంత్రిపురోహితసమేతుఁడై, శ్రీరామచంద్రుని యొద్దకుఁబోయెను. ఆతఁడు చిత్రకూటమున రాముని జూచి తన తల్లితప్పు క్షమింపుమనియు, రాజ్యము నేలుమనియు ప్రార్థించెను. రాముఁడందులకు సమ్మతింపకపోవుటచే భరతుఁడాతని పాదుకలను గైకొని నందిగ్రామములో రాముని ప్రతినిధిగ నుండి రాజ్యము పరిపాలించుచుందునని చెప్పి వెడలిపోయెను.

౫

సీతారామలక్ష్మణులు దండకారణ్యమునకుఁ బోయిరి. వా రొకచోట పర్ణశాలను నిర్మించుకొని కందమూలముల భుజించుచు కాలము గడపసాగిరి. లక్ష్మణుఁడు సీతారాములకన్ని విధముల నుపచారము లొనరించుచుండెను.

ఒకనాఁడు రావణుని సోదరియగు శూర్పణఖ సీతారామలక్ష్మణు లున్న పర్ణశాల కరుదెంచెను. ఆమె శ్రీరాముని సౌందర్యమునుజూచి యతనిని మోహించి, తన్ను పెండ్లాడుమని కోరెను. శ్రీరాముఁడు తనకు భార్య కలదనియు, లక్ష్మణుని వివాహము చేసికొనుమనియుఁ జెప్పెను. ఆమె

లక్ష్మణుని చెంతకేగ నతఁ డామెముక్కు-చెవులు కోసి పంపెను. ఆమె గోలుగోలున నేడ్చుచుఁ బోయి తనకు జరిగిన యవమానమును గుఱించియు, సీతసౌందర్యమునుగుఱించియు, రావణునితోఁ జెప్పెను. రావణుఁడు సీతను తన లంకకుఁ గొనికిఁ దీసికొనిపోఁ దలంచి మారీచుడను నిశాచరుని ముందుఁబంపెను.

మారీచుఁడు బంగరులేడి వలె వేషము వైచికొని పర్ణశాలకు సమీపమున దిరుగసాగెను. సీత యాలేడినిజూచి తనకుఁ దెచ్చిపెట్టు మని శ్రీరామచంద్రుని కోరెను. ఆతఁ డాలేడిని చాలదూరముతఱుముకొని వెళ్లెను. ఎంతప్రయత్నించిననుఆ లేడి లభించకపోవుటచే నతఁడు విసిగి యగ్ని బాణమును విడిచెను. ఆబాణముతగిలి విలవిలతన్నుకొనుచు మారీచుఁడు "హాలక్ష్మణా! హాసీతా" యని కేకవేసి మృతినొందెను. ఆకేక సీతకు వినబడి "లక్ష్మణా! నీయన్నగారి కేదియో యాపద సంభవించి నట్లున్నది. వెళ్ళిచూడు" మనియెను. లక్ష్మణుఁ డామె నొంటిగా విడిచి వెళ్ళుటకు సంశయించెను. ఆమె లక్ష్మణుని జూచి నిష్ఠురోక్తు లాడెను. ఆతఁ డామెపలుకులకు విస్మితుఁడై యొకగిరిగీసి దానినిదాఁటి యీవలకు రావల దని చెప్పి వెళ్లెను.

లక్ష్మణుఁడు వెళ్ళగానే రావణుఁడు సన్యాసివలె నేతెంచి భవతిభిక్షాందేహి" యని యడిగెను. నిష్కపటస్వభావ యగుసీత గిరిదాటివచ్చి బిచ్చ మిడెను. రావణుఁ డదే తగిన సమయమని యామెనుతాఁక కుండ భూమిని పెల్లగించి తన

రథముపై నెక్కించుకొని వెడలిపోవసాగెను. సీత జరిగిన మోసమునకు అపరిమిత మగుదుఃఖముచెందెను. ఆమె 'హానాథా'యని యెలుంగెత్తి యేడ్చుచు తన యాభరణముల నొకమూటకట్టి, ఋష్యమూకాద్రిపై విడిచెను. రావణుఁడు సీతను తన లంకకుఁ గొంపోయి, అశోకవనము నందుంచి తన్నువివాహ మాడుమని నిర్బంధింపసాగెను. పరమసాధ్వి యగు సీత రావణుని ముఖమైన చూడక తన నాథుఁడు వచ్చి యతనినిఁదప్పక చంపు ననెను. ఆమె నిద్రాహారముల విడిచి శ్రీరామచంద్రుని కొరకు తపించుచుండెను.

౬

ఇట రామలక్ష్మణులు తిరిగివచ్చి పర్ణశాలలో సీతనుగానక వెదకసాగిరి. శ్రీరాముఁడు సీత యేమయ్యెనో యని కుంద సాగెను. అతఁడు 'సీతా' 'సీతా' యని ఆ యరణ్యము ప్రతిధ్వనించునట్లు కేక లిడుచు పోవసాగెను. రామలక్ష్మణులు జటాయువను పక్షినిఁ గలిసికొని సీత రావణునిచే లంకకుఁ గొంపోఁబడెనని తెలిసికొనిరి. జటాయువుసలహా ననుసరించి వారు ఋష్యమూకపర్వతము కడకు అరిగిరి. అచట హనుమంతుఁడు వీరికి కనబడి, తనయజమానియు కిష్కింధాపురాధిపతియు నగు సుగ్రీవునియొద్దకు వారిని దోడ్కొనిపోయెను. అంతట సుగ్రీవ రామలక్ష్మణులకు స్నే

హాము కలిగెను. సుగ్రీవుఁడు శ్రీరామునిసహాయమున తనప్రబలశత్రువును సోదరుఁడునగు వాలిని సంహరించెను. పిదప సుగ్రీవుడు తనవానరసైన్యములనెల్ల ప్రోగ్రుజేసి హనుమంతాదులతో సీతాన్వేషణమునకై లంకాపురిపైదాడివెడలఁ దలంచి ప్రథమమున హనుమంతుని సీతజాడ తెలిసికొనిరమ్మనిపంపెను.

ఆంజనేయుఁడు సముద్రమును లంఘించి, లంకప్రవేశించి అశోకవనములో సీతను జూచెను. ఆమె వదనము దైన్యముతోఁ బఁజేయుచుండెను. నిద్రాహారములు మానుటచే నామె శుష్కించి యుండెను. అంజనాతనయుఁడు సీతనుజూచి, శ్రీరాముఁడిచ్చిన యంగుళీయకమునుజూపి, యతనిక్షేమ మెఱిఁగించెను. అతఁడు సీత యిచ్చినముద్రికను గైకొని కొలఁది దినములలో రామలక్ష్మణులు సైన్యసమేతముగ లంకకేతెంచి రావణుని వధించెదరని ధైర్యముగఁ జెప్పి వెళ్ళెను.

సీతసెలవుగైకొనిన యనంతరము హనుమంతుఁడు వనమును ధ్వంసము చేసి లంకను గాల్చి వెళ్ళిపోయెను.

౭

వాయుపుత్రుఁడు కిష్కింధకుఁబోయి రామలక్ష్మణులకు సీతవృత్తాంతము నెఱిఁగించెను. సీత ఒసఁగిన ముద్రికనుజూచి శ్రీరాముఁ డానందభరితాత్ముఁడయ్యెను.

సుగ్రీవుఁడు వానర సైన్యముతో లంకాపురికిఁ బయన మయ్యెను. వారు సముద్రమునకు వారధి కట్టి లంక చేరిరి. విభీషణుఁ డెన్నో విధముల సాధ్వియగు సీతను రాముని కిచ్చి సంధి చేసికొను మని రావణునితోఁ జెప్పెను. ఆతఁడు వినక యుద్ధమునకు తలపడెను. విభీషణుఁడు శ్రీరాముని యొద్దకు వచ్చి యతని శరణు వేడెను. శ్రీరామునకును రావణునకును భయంకర సంగ్రామము జరిగెను. రావణుఁడు రణమున నిహతుఁ డయ్యెను. శ్రీరాముఁడు విభీషణునకు పట్టము కట్టెను. ఆతఁడు సీత పదిమాసములు రావణునిలంకలో నివసించుటచే లోకులే మనుకొందురో యని అగ్నిప్రవేశము చేయవలె ననెను. సీత అగ్నిప్రవేశము చేసి నిరపాయముగ నీవలికి వచ్చెను.

పిమ్మట శ్రీరాముఁడు సీతాలక్ష్మణహనుమ త్సమేతముగ నయోధ్యకు తిరిగి వెళ్ళిరి. శ్రీరాముఁడు ప్రజానురంజకముగ రాజ్యము నేలసాగెను.

౭

కొంత కాలము గడచెను. శ్రీరాముఁ డొకనాఁడు ప్రజలు తనపరిపాలనమును గూర్చి యే మనుకొనుచున్నారో ఆరయ వలెనని ప్రచ్ఛన్నవేషుఁడై నగరసంచారము చేయసాగెను. ఒకచోట నాతఁడు చాకలి యొకఁడు తనభార్య పుట్టినింటఁ

జాలకాల ముండుటచే తా నేల నశెను. ఆతని బంధు వొకఁడు మహారాజైన శ్రీరాముఁడే తనభార్యను తెచ్చికొనఁగా నీకేల నాపంత మనెను. అంతనాచాకలి (రాముఁడు వెఱ్ఱివాఁడు కావున పరునియింట పదినెలలున్న భార్యను దెచ్చికొని నాఁడు నేనట్లు చేయ ననెను.

రామభద్రుఁ డీసంభాషణము నాకర్ణించి తనభార్య శీలమునుగూర్చి లోకు లట్లు సందేహించు చున్నారని మిక్కిలి చింతించెను.

మఱునాఁటియుదయమున శ్రీరాముఁడు లక్ష్మణుని బిలిచి, సీత నరణ్యములో విడిచి రమ్మని చెప్పెను. లక్ష్మణుఁడు సీతను కాననమునకుఁ గొంపోయి, శ్రీరాముఁడు తన కట్లానతిచ్చె నని చెప్పి వెడలిపోయెను.

సీత తన దురదృష్టమునకు మిక్కిలి వగచెను. ఇంతలో వాల్మీకి మహర్షి వచ్చి సీతను తనయాశ్రమములోనికిఁ దీసికొనివెళ్ళెను. ఆమెకు కుశలవు లనుకవలపిల్లలు పుట్టిరి. కుశలవులు దినదినాభివృద్ధి నొందసాగిరి. వాల్మీకి కుశలవులకు ధనుర్విద్య నేర్పెను. సకలశాస్త్రములు చదివించెను.

ఇట నిట్లుండగా శ్రీరాముఁ డశ్వమేధయాగము చేసెను. యాగానంతరము శ్రీరాముఁడు యాగాశ్వమును విడిచి పెట్టెను. శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు సైన్యసమేతముగ నాహయము ననుసరించి వెడలిరి.

కుశలవు లాయశ్వమును బంధించిరి. కుశలవులకును రామలక్ష్మణభరతశత్రుఘ్నులకును సంగరముజరిగెను. శ్రీరాముఁడు కుశలవుల యుద్ధకౌశలమున కచ్చెరువొందెను. అతఁడా బాలురు తన కుమారులే యని తెలిసికొని మహదానందము నొంది, తనభార్యను చూడ వాల్మీకి యాశ్రమమునకుఁ బోయెను. వాల్మీకి సీతశీలము నిష్కళంక మనియు, నామె నేలుకోవలసిన దనియుఁ జెప్పెను. శ్రీ రాముఁడు సీతనుదీసికొని అయోధ్యకు వెళ్ళెను. సీత పతినేదైవముగ నెంచి యెన్ని కష్టములు సంభవించినను సహించియుండెను. ఆమె చరిత్రము స్త్రీల కాదర్శనీయమైనది.



# సుమతీ దేవి



అధిష్ఠానపురమున కౌశికుఁ డను బ్రాహ్మణుఁడు కలఁడు. ఆతనికి అనుపమాన సౌందర్యవతి యగుభార్య కలదు. ఆమె పేరు సుమతి. కౌశికుఁడు వేశ్యాలోలుఁడై కాలము గడప సాగెను. సుమతి కాపురమునకు వచ్చినపిమ్మటఁగూడ నతఁడు వేశ్యాసాంగత్యము మాన లేదు. ఇట్లుండగా నతని తలిదండ్రులు మరణించిరి. వారి మరణానంతర మితఁడు మఱింత స్వేచ్ఛగా ధనమును ఖర్చుపెట్టసాగెను. అచిరకాలములో నతఁడాస్తి పాడుచేసెను. తల్లి ఉన్నంతకాల మతనికి భార్యతో నంతగా సంబంధము లేకపోవుటచే తిట్టుచుండెడివాడు. తల్లిచనిపోయినపిదప, నింటిపనులన్నియు భార్యయే చేయవలసినవచ్చుటచే నామెచేయు ప్రతికార్యమందు నేదోయొకలోపము కల్పించుచు కొట్టమొదలుపెట్టెను. ఒక్కొకపు డతఁడు సుమతినికొట్టునపు డామె స్మృతినిగూడ కోల్పోవుచుండెను. ఆమె యట్లు చైతన్యము లేక పడియున్నపు డతఁ డామెకెట్టి యుపచారములు చేయక వేశ్యాగృహమున కేగుచుండెడివాడు.

ఒకనాఁ డతఁడు తండ్రి యాబ్దికము పెట్టవలసి వచ్చెను. నాఁడు సుమతిచేసిన అరిసెలు గారెలు తానుసంతుష్టి కలుగునట్లు భుజించి, కౌశికుఁడు ఆమె భోజనముచేయుటకు పూర్వముభోగముదానియింటి కామెచేతనే పట్టించుకొనివెళ్ళెను. ఆవేశ్య గారెలు చాలతక్కువ చేయించితి వే మసి కౌశికు నడిగెను. ఆతఁడు మార్గమధ్యమున నేను చూడకుండ నీ వేమైన తింటివేమోయని సుమతినికొట్టి, పొమ్మనెను.

సుమతి యేడ్చుచు నింటిదారి పట్టెను. ఆమెకు జీవితముపై విరక్తి కలిగెను. దారిలో ఆమె కొక సర్పము కనిపించెను. ఆ పాము కఱచి తాను చనిపోయిన బాగుండునని యామె తలఁచెను. ఆతలంపుతో సుమతి యా పామున కడ్డముగ నిలిచెను. అది యామెను కఱువక తప్పించుకొని వెడలిపోదొడఁగెను. ఆమె పరుగెత్తుకొనుచుపోయి యాసర్పమును బట్టుకొనఁబోయెను. ఆపాము మనుష్యులు మాటలాడునట్లు యిట్లనెను.

"సుమతీ! నేనుధర్మదేవతను. నీభర్త నిన్ను బాధించుచున్నందులకు విచారించవలదు. దేవతలు నీపాతివ్రత్యమును పరీక్షించుచున్నారు. పతివ్రతకు పతియేదైవము. పరమసాధ్వివగుటచే నీవునీభర్త యెన్నివిధముల బాధించినను సహించవలెను."

సుమతి యాధర్మదేవత భాషణముల కలరి, యామెకు మ్రొక్కి యింటికిపోయెను.

౨

సుమతికి కౌశికునివలని బాధలు క్రమక్రమముగా హెచ్చుచుండెనుగాని తగ్గుటలేదు. తన యాస్తి నంతయును పాడుచేయుటచే నావిప్రునకు తినుటకు తిండి లేకపోయెను. తా నొనరించిన దుర్వ్యయమునకును అకార్యములకును కొంచెము పశ్చాత్తాపముచెంది కౌశికుఁడు ధన మార్జించినఁగాని యింటికి తిరిగిరా ననిబయలుదేఱెను. సుమతి తానుకూడ నతనితో వత్తు ననెను. అంతఁ డా కోపోద్దీపితుఁడై 'ఆఁడుదానవు కావా? నే నెక్కడికి వెళ్ళిన నక్కడికి వచ్చెదవా?' యని చితుకఁగొట్టి వెడలిపోయెను.

కౌశికుఁ డొక యరణ్యమునఁబడిపోవుచుండఁగా, కొందఱు దొంగ లెదురుపడి 'మాతోవచ్చి దొంగతనములందు మాకు సాయము చేసెదవా? లేదా? మాలోఁ గలియనిచో ని న్నిప్పుడే చంపుదు' మనిరి. చేయునదిలేక యాభూసురుఁడు వారితోఁగలసి దొంగతనములు చేయ నారంభించెను. సుమతి భర్తను వెదకికొనుచు పగలనక రాత్రియనక నిద్రాహారములుమాని తిరుగుచుండెను. ఒకనాఁ డామెకు దొంగల గుంపులోఁ గలిసియున్న భర్త కనిపించెను. ఆమె యాదొంగలను బతిమాలి యతనిని విడిపించుకొని వచ్చుచుండెను. కొంతదూరము వచ్చిన పిదప కౌశికునకు దుర్బుద్ధి జనించెను. దొంగలతోఁగలిసి ధనము సంపాదింపకుండ మరల

నింటికిఁ దోడ్కొనిపోవుటకు నీవేల వచ్చితి' వని యాతఁ డామెను రక్తము కాల్వలు కట్టునట్లు కొది యొక చెట్టునకుఁ గట్టి వెళ్లిపోయెను.

ఇంతలోఁ గొందఱు మొఱకు లామార్గమున వచ్చి యా మొవలన జరిగినదంతయు నెఱింగి, కౌశికుని వెదకి పట్టుకొని తీసికొనివచ్చి యతనిచేతనే ఆకట్లువిప్పించిరి. కౌశికుఁ డాకట్లు విప్పిన తరువాత నామొఱకులు 'మరల నీయడవిలోఁ గనబడి నచోఁ దన్నెదము. ఇంటికిపొమ్ము' అని బెదరించి వెడలి పోయిరి. అంత నతఁడు సుమతితో నింటికిపోయెను.

## 3

కొలఁది దినములు మాత్రమే కౌశికు డింటిలో స్వస్థుఁడై యుండెను. ఒకనాఁడు రాత్రి యతఁడు భార్యతోఁ దెలుప కుండ భోగముదాని యింటికివెళ్ళెను. సుమతి తననాథుఁ డెం దేగెనో యని డోలాందోళిత చిత్తయై యుండెను. తెల్లవారిన పిదప కౌశికుఁ డింటికివచ్చెను. అదిమొదలాతఁడు లేవలేదు. జాడ్యములచే లేవలేకుండ మంచముం బట్టెను. సుమతి వైద్యు లచే మందిప్పించఁగా నాతఁ డొకింత స్వస్థుఁ డయ్యెను.

ఇట్టిస్థితిలో నుండగా కౌశికుని కొకనాఁడు వేశ్యాసాంగ త్యము చేయవలె నని కోరిక కల్గెను. ఆతఁడు సుమతిని బిలిచి 'నాకు మనోహారి అనువేశ్యతో నీరేయి గడుపవలెనని

కోరికగా నున్నది. ఆవేశ్య యింటికిఁ బోయి నా కోరిక నామె కెఱిఁగించి, ఆమె నంగీకరింపఁజేసి నన్నటకుఁ గొనిపొమ్ము. నాయీ కోరిక సఫల మొనర్పవేని నేను చనిపోయెద'ననెను.

సుమతి ఆ వెలయాలి గృహమునకుఁ బోయి ఆమె నెట్లో సమ్మతింపఁజేసి తన భర్త నారాత్రియే గంపలో కూర్చుండఁ బెట్టుకొని బోగముదానియింటికిఁ బయన మయ్యెను. బోగముది ఆరాత్రి కౌశికునితో గడపుటకు తనకు వీలు లే దనెను. చేయునది లేక సుమతి మరల పతిని గంపలోఁ గూర్చుండఁ బెట్టుకొని యింటికి బయలుదేఱెను. ఆరాత్రి గాఢాంధకార బంధుర మై యుండుటచే నామె దారితప్పిపోయి, మాండవ్య మహాముని యాశ్రమమునకు వెళ్లెను. మాండవ్యమహాముని ఒంటికాలిమీఁద నిలువఁబడి తపస్సు చేసికొనుచుండెను. సుమతి నెత్తిపై నున్న గంప తగిలి యాముని కూలఁబడెను. ఆముని కోపముతో మండిపడి "నీవు నీమగని నెత్తుకొని పోవుచు సంతోషమున నై మఱచి నా కపకారము చేసితివి. నీభర్త సూర్యోదయము కాకుండ చచ్చునుగాక" యనిశపించెను.

సుమతి యి ట్లనియెను.

"అయ్యా! దారి తెలియక యిట్లువచ్చితిని. కనుల కేమి యును గనిపించని కటిక చీఁకటిలో మిమ్ముఁ జూడఁజాలక యీ అపరాధమును చేసితిని. క్షమింపుఁడు"

ఆమె యెన్ని విధముల బతిమాలినను ఆముని విన నందున "నేను పతిని దైవముగా నెంచుకొను పతివ్రత నగుదునేని సూర్యోదయము కాకుండుఁగాక" యని ప్రతిశాపమిచ్చి వెడలిపోయెను.

ఇలు సేరిన పిదప కౌశికుఁడు తన ఇరుగుపొరుగువారలఁ బిలిచి "అయ్యలారా! నా భార్య పరమసాధ్వి. వివాహమైనది మొదలు సుఖ మన్నమాట యెఱుఁగదు. మాండవ్య మహాముని నేను సూర్యోదయము గాకుండ చనిపోవుదునని శపించినాఁడు. ఈమెను మీపుత్రికగా నెంచుకొని జాగ్రత్తగా చూచు చుండు" డని వేడుకొనెను. సుమతి యెంత ధైర్యము చెప్పినను అతఁడు వినఁ డయ్యెను.

సూర్యోదయము కా దయ్యెను. ఎనిమిది దివములు గడచెను. లోక మంతయుఁ దలక్రిందగుటకు సిద్ధముగ నుండెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నింద్రాది దేవతలు వచ్చి సూర్యోదయ మగునట్లు చేయుమని సుమతిని ప్రార్థించిరి. సుమతి వారలకు మాండవ్యమహాముని యిచ్చిన శాపవృత్తాంతమును తెలిపెను. త్రిమూర్తులు 'అమ్మా! నీ నాథుని బ్రతికించు భారము మాది. నీ శాప ముపసంహరించుకొను' మనిరి. ఆమె 'సూర్యోదయ మగుఁగాక' యనఁగా భానుఁడుదయించెను. త్రిమూర్తులు కౌశికుని [illegible]